ప్రథమ పుష్పము.

శ్రీ

# పాద్యము

గ్రంథకర్త

'పుట్టపర్తి.'






ప్రకాశకులు

శ్రీ రాయలసీమ కావ్యసంపాదనాసంఘము,

ఎమ్మిగనూరు.

వెల రు. 0-8-0

1944

శ్రీర్జయంతు

# మున్నుడి.

నా గురువు పరమేశ్వరుఁడు. అతడిప్పుడున్నాడు. లేడు. ఎప్పటికీ వున్నాడు. దివ్యభావాలైన, ప్రేమా, భక్తీ, మొదలైన వాటికి, నశ్వరత్వమూ, భౌతికమాలిన్యమూ లేనట్లే, వాని లక్ష్యాలకుకూడా లేవు. ఈసత్యాన్ని గమనించిన, అనుభవించినవారు— ఋషులు—కవులు.

నేనీ గ్రంథం వ్రాయునాటికి, మరాఠీలో "సంతసాహిత్యాన్ని" యెక్కువగా చదువుతూ వుండింది నిజం. ఆపోకడలే దీని రచనకు దోహదాలు. సృష్టి మాది. అనుభవించే రసికత సహృదయులది. ఇప్పటికింతే.

"పుట్టపర్తి"



# పరిచయము.

శ్రీ రాయలసీమ కావ్యసంపాదనా సంఘము ప్రకృతమొక చిన్నసంఘము. తలపెట్టినది గొప్పకార్యం. మనసీమలో గల అముద్రిత గ్రంథములను ప్రచురించి-కవులను ప్రోత్సహించి-యథాశక్తిగ వాఙ్మయసేవఁజేయుట. సారస్వతసేవ-ఒక విధముగ మానవసేవ.

సారస్వతము విజ్ఞానప్రదము. విజ్ఞానమానందదాయకము. సంఘమింతవరకును కారణాంతరములచే కార్యము ప్రారంభించియుండలేదు. మిగిలిన విషయములలో మాదిరిగనే-వాఙ్మయమునఁగూడ-ముభావము వహించిన రాయలసీమలో ఇపుడిపుడు—ఉదయరేఖలు కానవచ్చుట ముదావహము.

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు సుప్రసిద్ధ విమర్శకుఁడు, పండితుఁడు, కవి. సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషాకోవిదుఁడు. ఆయన రచించినదీ ప్రార్థనాత్మకమగు కృతి. కవి-సనాతనాధునాతనరీతులను చక్కగ నలవరచుకొనిన దిట్ట. కృతి—సలలిత పదజాలసమన్వితము. వారి రచనలు మునుపే లోకము చవిచూచియున్నది. రసికులగు పాఠకమహాశయులు ఆదరింతురని విశ్వసింతుము.

తమ యీకృతిని మాకు ప్రకటించుట కనుమతించిన శ్రీమాన్ నారాయణాచార్యులవారికి మా కృతజ్ఞతాభివందన ములు.

ఏతత్గ్రంథకర్తృ రచితమగు "విరహగోపి" నే ప్రకటింపఁదలచితిమి. కాని, అది అసంపూర్ణమగుట,—కవిగారు "విజయప్రబంధ" నిర్మాణనిమగ్నులగుటయు; సంఘ మీరీతి నిశ్చయించెను.

రాయలసీమ-కళాసీమ. మహాకవులకు, గాయకసార్వభౌములకు, చిత్రకారులకు, తదితర కళావేత్తలకు నిది నిలయభూమి.

దేశీయులు వారిని గుర్తించి—ఆదరము చూపుట చాల అవసరము అట్టి వారిని ప్రోత్సహించు సంఘములు విద్యాసంస్థలు వెలయుట అత్యవసరము.

రాయలసీమవాసులందఱియొక్క ఆదరాభిమానముల నాకాంక్షించుచున్నది ఈ సంఘము. ఆర్థికంగా దీని నభివృద్ధికిఁ దేవలసిన బాధ్యత ఉదారులురసికులునగు దేశీయ ధనాఢ్యులపై నున్నది.

కథలు—కథానికలు, నవలలు—నాటకములు మొదలగు వాఙ్మయశాఖలఁ బెంపొందించి కవులు సహాయ మొనరింపఁ బ్రార్థితులు. ఈయిరువురి ఆదరాభిమానములు సంఘమున కభివృద్ధిదాయకములు.

ప్రప్రథమమున మా యుద్యమమునకు చేయూత నిచ్చిన శ్రీ కవితాకళాసమితి, తాడిపత్రికి మా కృతజ్ఞతాంజలి. మా కిందు తోడ్పడిన "సహాయకులకు" హృదయపూర్వకాభివందనములు. ఉదారులగు మా "దేశబంధు" కార్యనిర్వాహకవర్గమునకు మోడ్పుఁగేలు.

కోరినదే తడవుగ మాకు విరాళా లిచ్చిన మహాశయులకు మా కృతజ్ఞతఁ దెలుపుచున్నాము.

సంఘము రాయలసీమవాసులందఱి యభిమానమునకుఁ బాత్రమగునని విశ్వసించుచున్నాము.

అట్టిసదవకాశముఁ గల్గించుటకై విజ్ఞానపరంజ్యోతికి మా ప్రార్థనాంజలి.

ఎమ్మిగనూరు.
15-11-1944

ఇట్లు,
శ్రీ రాయలసీమ కావ్యసంపాదనా సంఘము.





# పాద్యము

తరుణాబ్జతుహిన ముక్తామాలఁ బోలు నే
త్రముల దయార్ద్రబాష్పములతోడ
గంభీరభావ నిష్కలుషదీప్తులు పర్వి
యొఱపెట్టి విడిచిన పరిధితోడ
నవరసాలకిసాల ప్రవిమలారుణకాంతి
నొడి గొన్నజుంజురు జడలతోడ
నావంటిపతితు లెందఱినైన రక్షింపఁ
జాఁచిన యభయ హస్తంబుతోడ
యజ్ఞవేదికవలె బవిత్రారుణములు
నిండుచూపులు దిక్కులనిండి వెలుఁగ,
మాగురుస్వామి! నాపాలిమధురమూర్తి!
వచ్చినాఁడమ్మ! మాయింటివఱకు నేఁడు. 1

ఆమహాఋషి చూపులయందుఁ బొడమి
జీవకారుణ్యమెల్లడఁ జిదికినదియొ!
నామనోహరు హృదయమంటపమునందు
వేదవిజ్ఞాన దీపముల్ వెలసినవియొ! 2

పుట్టినది మొదలింత నవ్వుటకుఁగాని
భాగ్యమే లేనియట్టి యభాగ్యుమీఁదఁ
గరుణవారినదేమి! యెవ్వరును లేరె
పాత్రములు నీదు హృదయ సంస్పందమునకు! 3

భయము గలిగించు నొక యమావాస్యనాఁటి
వితథశర్వరిఁ బోలు జీవితమునాది,
లోకముల వెలిఁగించు చంద్రుఁడవు నీవు
ఎక్కడి ఋణానుబంధమోయీ! గురూజి! 4

వాసనయు లేని క్షుద్రపుష్పమ్ము నెవరు
తలధరింతురు? రాలిపోవలెనెగాని,
బ్రదుకు జీకిన నాప్రేతహృదయ మెంత
యింపుగానందు కొంటివోయీ! మహర్షి! 5

శాక్యముని మాలవానిజర్జరితకుటినిఁ
బూతమొనరించెఁ దేనెచూపులను నాఁడు,—
ప్రవిమలంబైన నీపాదరజము నా య
దృష్టమున నూత్నరేఖ దీర్చినది నేఁడు. 6

సద్గురూ! నాకు నానాఁటి శ్వపచునకును
సామ్య మిసుమంతలేదుఁ నిశ్చయము గాని,
నీవుమాత్రము పాపపఙ్కిలజగంబుఁ
బూతమొనరించు బుద్ధదేవుఁడవె, నిజము. 7

కారణమ్ము లేకయే బహిష్కారమునకుఁ
బాత్రమైనట్టి నావంటి పతితుమీఁదఁ-
జచ్చుటకె జన్మమెత్తిన జడునిమీఁద-
నింత నీదయ ప్రసరించు టేల? తండ్రి! 8

నిండు పున్నమనాఁటి వెన్నెలల గడుపు
గ్రుడ్లగూబకె విలపించు కుమతు లెవరు?
నాగురూ! నీ యలౌకికానందమందుఁ
గానఁబడె నేమొ! దీనుని కరుణగాథ. 9

ఆయువంతయుఁగూడ నిరాశతోడఁ
గడచినది- శుభాకాంక్ష యెన్నఁడును లేదు,-
నాప్రభూ! నీవు వచ్చుట నమ్మలేను,
పుణ్యములపంట! నమ్మకపోవలేను. 10

కలవలె హఠాత్తుగా వచ్చి నిలిచినావు
తండ్రి! పతితుని యీ గృహాంతరమునందు,
సత్యమునువోలె నెపుడు శాశ్వతముగాఁగ
నిండుచూపుల నన్ను మన్నింపవయ్య! 11

నాకలుషములు గొలువఁ మానసములు లేవు,
నావ్యథల నెఱిఁగించు వాఙ్మయము లేదు,
నాకనులనీరు నిల్వ సంద్రములు లేవు,
నన్ను రక్షింపుమని పల్క నాల్క లేదు. 12

ఈదరిద్రుని హతకుంటి నెందుఁగాని-
కోమలంబైన హృదయంబుగూడలేదు,
విమలనైవేద్యమునకు దీపములు లేవు
కనులలో భక్తికిరణరేఖయును లేదు. 13

నిన్నుఁ బూజించు నాసజనించుఁ దొలుత
నర్హుఁడనెయన్న సందేహమవలఁ గలుగు
దాఁచినకరంబు వెనుకకుఁ దగ్గిరాదు-
తిగిచినకరంబు ముందుకు నెగసిపోదు. 14

పలుకరింత మటంచుఁ గోర్కెలు జనించు-
నింతలో సిగ్గు నన్నావరించుకొనును,
భావశబలత్వమునఁ దీసివైవలేను-
పూజసేయు పేరాస చంపుకొనలేను. 15

నీయెదుట నేను కైమోడ్చి నిలిచినపుడు
మనసునకుఁ దోఁచు నా చిన్నతనము నాకుఁ
దనువుఁ గంపించు, గుండెలు దద్దరిల్లు,
నాయవస్థితిదే పోవునా! యటంచు. 16

బాష్పపూరంబుతో నీకుఁ బాద్యమిత్తు
ననుకొనెదఁగాని, ప్రతిజలకణముగూడఁ
బరమపూతంబు-దమవేరు-పలుకదేమొ!
యన్న సందేహమునకు రిక్తుఁడై నిలుతును! 17

మనసు మెదలదు-గన్నులుఁ గనవు,-పలుకు
బయలు దేరదు ఉపచార వాక్యములకుఁ-
బ్రభలు చల్లు నివాతదీపంబు, నీవు
మోహనంబైన యొక ముగ్ధపూజ నాది.

సద్గురూ! నీవు నేలపైఁ జరణములిడి
వచ్చునప్పుడు—నా యెదపైన నడచి
వచ్చునటులుండు—రెక్కలు పట్టుకొన్న
కొదమతూనీఁగవలెఁ గొట్టుకొందు నేను.

లౌకిక విషాదములగుండె రగిలి రగిలి,
నీచరణసీమ నాశ్రయించితిని నేను
తండ్రి! యిట నొక్క నూత్నానుతాపమునకు
నన్నుఁ గురిసేయు వేమి యన్యాయ మోయి!

ఏడ్చుటకునైనఁదోవ నీదేమి-తండ్రి!
ఈ హృదయవేధ నింక సహింపలేను,
జ్ఞానమునకన్న నాకు నజ్ఞాన మొసఁగి,
నీకనుల నీలినీడ మన్నింపవయ్య!

గాలి బోరున వీవఁ వృక్షములు విఱిగి
నాశనంబైన భయదకాననము వోలు,
నా యెడందలో-నింకొక్కనాఁటి కేనిఁ
దీర్చికొందును, నా గురుదేవు ప్రతిమ.

పరులఁ బ్రశంసనేసి నవ
భాగ్యములందుటకంటె, నాత్మ సం
స్థిరుఁడయి పున్కపాత్రమునఁ
దిన్నను నామదిఁజింతలేద, యీ
శ్వరు గుణతంద్రగీతములఁ
బాడుచుఁ జిక్కనిపూవువోలె, నా
పరువము వాడకుండ
నిల్పవెమని, రాలినఁజాలు, సద్గురూ!



# వేదనా శతకము.

నీవొక దివ్యదీపమయి, నీ వెలుఁగుల్ప్రసరించుచోట-నా
జీవితరేణు వింత వికసించినచో మదిఁజింత లేదు, స్వా
మీ! వెలకట్టరానిది సుమీ, భవదీయఋణంబు లీనమై
పోవును నాకృతజ్ఞత ప్రభూతము నీకరుణాంబురాసిలో. 1

నీ కనుఁగోనలందు వెలినీడలు వోనెడు నట్టి లోక ర
క్షాకరకాంతిరేఖల వికస్వరమైనది నాయెడందలో
రేకులువిచ్చి—నీవు విదలించి నవ్వులు క్రొత్తతావులై
ప్రాకినవయ్య! యీపసితలంపులఁ జిక్కని నోముపంటలై. 2

నేనొక పూలమాలనయి, నీచరణాంబుజ సీమఁబండి, యం
మ్లానమ్ములైన వాసనలు రాలిచిపోవలెనంచుఁ గోరుకొ
న్నాను ప్రభూ! దురంతతమసాంతరితంబగు జీవితంబుతోఁ
గానని కోర్కికై-గనులు కాయలుగాయఁగఁ గాచియుండెదన్. 3

'నా'యని చెప్పి కోఁదగు మనస్సులు లేకయె కుంది, నారక
ప్రాయమ్ములైన జీవితవిలాపములన్ దురపిల్లుచున్న శు
ష్కాయువు నాకు-నీవొకఁ డఖండరసాకృతిఁ దోఁచి పిచ్చియై
పోయె నిదేమి కర్మము ప్రభూ! నిను నెంచుట పెద్దదుఃఖమై. 4

నీవు వచించినట్టి రమణీయవచస్సులు మాటిమాటికిన్
భావన సేయునప్పుడు భవన్మృదు రూపము మ్రోలనిల్చి న
ట్లై, వెతఁగుంది నేనణువునై ధరలోనికిఁ గ్రుంగిపోదు, ల
జ్జావివశంబు-నాయెద-ప్రశంసయొనర్పదు మూకవీణయై. 5

నీచిఱునవ్వు దివ్యతటినీవిక చాముప్పజమంజులంబు, కా
నీ చవిలేని నాతలఁపు లీసొగసున్నన మోర్వలేవు-న
న్నేఁచును దీవ్రమై యుపనయింపఁగ సాధ్యముగామి, దుఃఖ
కీలాచిత బాష్పపూరముల రాల్తును ధారలుగాఁగఁ గన్నులన్. 6

ఆశనిరాశ్రయై బ్రతుకునందు నశించుట దప్ప-వేరు వి
శ్వాసములేని నావలపుపంటగఁ దక్కితివన్న యా సమా
శ్వాసము మాసిపోయినది స్వామి! వియోగము సైఁపలేని యా
వేశము-ఘోరమై బ్రదుకుఁ బీల్చిన దొక్క మహాజలూకమై. 7

స్వామి! భవత్పయోజపదసన్నిధి నాదురవస్థ దెల్పి-న
న్నోము మటంచుఁ జెప్పికొన నూహజనించునుగాని, యంతలో
నేమొ వచింపరానిది గ్రసించును-సిగ్గు-మదీయ శీర్షమే
భూమికిఁ గ్రుంగి, చొచ్చుకొని పోవును చీఁకటిలోఁతుదారులన్. 8

నీమహనీయతన్దెలియనేరఁగనైతి నటన్న చింత, నెం
దో మతిపోయి యాకులతఁ దూలఁగఁ గ్రొత్తమొగిళ్లు పుప్పొడుల్
ప్రామిన వింతనవ్వులను రాల్చిననుం గెరలించిమైతు స్వా
మీ! మరి నేను నవ్వెదను మీకయి-వాసనలేని నవ్వులన్. 9

నీ యమృతంపు నవ్వులకు నిష్ఠురభావము కవ్విరేఁగు నే
మో! యెదురై యెడంద కొసఁబుట్టును-నల్లని త్రాఁచువోలె, బా
ధాయిత హాసమింతకును దథ్యము-యేడువలేని నవ్వు తం
డ్రీ! యది భావనాబలము డీల్పడిపోవు సమన్వయింపగన్. 10

నీ చరితామృతంపురుచి నిండిన నావందికన్యసత్కథల్
వాచవిగావు రేవగలు భావనకందని నీ స్వరూపమున్
యోచన చేసిచేసి వెడయూహాలు వ్రాడులెయయ్యె నేవకున్
గాచిన జీవితంబునకె గల్గదు శాంతిలవంబు నేటికిన్. 11

నాగురుదేవ! నాయెదుట నాట్యము లాడిన యట్లు దోఁచి యెం
డేగితివయ్య? ముందు నటియింపక యీ విరహవ్రతంబుతో
వ్రేఁగెడు దుఃఖజీవిక భరింప, భరింపఁగనీవు, నీవు నా
పైఁ గురియించినట్టి యనుభావ్యలసత్కరుణావిశేషముల్. 12

నాకవితాప్రసూనము లనారతమున్భవదీయమంజుల
శ్రీకరపల్లతావిచికిలీకృతచిత్తములై, మరందధా
రాకలహర్షజీవనవిలాసములన్ నటియించి రాలిపో
నీకమనీయ రూపములు! నీచిరునీడలు ప్రాఁకు చోటులన్. 13

నీవొకసారి చూచిన-ఘనీకృతి నొందిన నాయెడంద-చిం
తా వివశమ్ము-మత్తుగొని దాఁటులు గొట్టును లేడిపిల్లయై,
నీవొకసారి నన్ను గమనించుచు ఫక్కున నవ్వినంత, నే
పోవులుగాఁగ రాలిపడిపోవును జీవితకాంక్షలన్నియున్. 14

తలపయిఁజిన్ని చుక్కలవితానముఁ గప్పిన యట్టులున్న పా
టల మసృణంబు సుందరజటావలయంబు నటింపఁ, గన్నుఁగో
నలఁ గళలూరఁగా నిలుము నాయెదుటన్, దడికంటివిచ్చుఁ జూ
పుల నమృతంబు ధారలయి పోవఁగ శాంతిని గౌగలించెదన్. 15

ఏనుభవద్వియోగము సహింప నటించుచును జెప్పఁబోవ, నే
దో నెపమొడ్డి నాతలఁపుఁ దుంటలు గొట్టెదు నవ్వి నవ్వి, నా
ప్రాణము లేల దీసెదవు స్వామి! యిటే బ్రదుకంగనైన నీ
వో ననువెంటఁదీసికొని పో బ్రదుకుట మఱిభారమైనచో. 16

నాగృహమందె నిల్తునని, నాకుసుమార్చనయే గ్రహించి న
న్నేగయిఁ గొందునంచు-వచియించి, యమాయికమౌ నెడందలో
మ్రోగఁగఁజేసి తాశలు ప్రభూ! కనుపింపవు-చూచి చూచినా
మూఁగతలంపు లన్నిదికిపోయిన వెన్నియొ యుష్ణబాష్పముల్. 17

నేనొక గొప్పవాఁడనని నీకడడాబులు గొట్టలేదు, తం
డ్రీ! ననువంటి పాపిని భరింపగ లేదిల, కాని త్వత్కృపా
నూనపవిత్రదేవధుని యుబ్బుట లూఁగినచోటఁ బావచిం
తానిబిడాట్టహాసములుఁ దట్టఁగవచ్చున యేమిరా, ప్రభూ! 18

కాయలు కాచునేమొ నిడుగన్నులు నీకయి కాచి కాచి? తం
డ్రీ! యిఁకనైన నాశ్రమము గణింపవు పైని పరీక్షసేతు వే
మీ? యిదె-బాకు-చీల్చికొను మీ యెదశోధన సేసికొమ్ము, దీ
క్షాయుతమైన నాహృదయసద్మము నీ వెనుదివ్వె యేలునో! 19

గుండెలు గ్రుళ్లి యేడ్చుటకుఁగూడ గళంబునఁ జెమ్మలేక భ
క్తుండు జపించునంత కొనగూడదొ నీదయచాలుఁ నాకు వే
దండము ద్రొక్కనోర్చు నెలతాపటలంబు? పరీక్షనెగ్గు యో
గ్యుండగు నేని నీకరుణఁ గోరునె? వడ్డికెజెల్లు కోవవో! 20

పతితుండ నేను, నా పతితపావనమూర్తివి నీవు, తీవ్ర శా
శ్వతములం-ఘోరు లిర్వురకు సంధిలెఁ, బాపమొనర్ప నా కళం
కితమతి కెగ్గు లేదు, చిలికింపవు జెమ్మట నీవు పాపసం
తతిఁబడఁగూల్పఁ జూడవలెఁ దండ్రి! మరెవ్వరు గెల్చుకొందురో! 21

నీవు పరీక్షసేసెద వనేకవిధంబుల నన్ను, నీ పరీ
క్షావిధి కాఁగలేక కలుషంబున నిందయొనర్తు నిన్నుఁ, గా
నీ, వెనువెంటనే యెడఁదనిల్చును నీదయ- వానకాళ్ళలై
పోవును గన్నులందుఁ బడిపోదును కూలిన పెద్దవృక్షమై. 22

పాపము చిట్టి-నెత్తిపయి ఫక్కున నవ్వఁగ సోలి, లోక నిం
దావరిశీర్ణజీవితమునన్ లవమూరట లేకయే, వృథా
శాపుటపాకవేదనలు చంపినఁ జావక నిల్చినాఁడ, నీ
నాపయినా భవద్రభసనాట్యము? న్యాయమ? నీకు, సద్గురా! 23

ఎంతగ నేడిపించెదవొ? యీజడకాష్ఠము నేడిపించి నీ
పంతము దీర్చుకో! తనువుఁ బాసినఁ బుణ్యమె పండిపోవు ని
శ్చింతతఁ బోదుఁగాని, ననుజీవముతో మననిచ్చి, కష్టముల్
వంతుకుఁ దెచ్చి, గ్రుమ్మకుము ప్రాణము- నీకు నమస్కరించెదన్ 24

నాదురవస్థ లెంతటి ఘనంబులో, తండ్రి! రవంత యేని నా
పై దయగల్గదే? వికలభావముతో సుడిఁజుట్టుకొంచు ని
ట్లే దరిలేని యీభవము నీఁదఁగనేవలె నేమి! యాత్మస
మ్మోదము లేదా? యెన్నటికి మోక్షము లేదా? విపన్నజీవికిన్. 25

బాంధవులేల నన్నుఁగని పల్కరటించన-నీకు రాముఁడే
బాంధవుఁడన్న మంత్రమును బట్టుగ నాయెద గ్రుడ్డివోహ సం
బంధము ముళ్లుదీసితివి-స్వామి! గదా, మరినీవె యిప్డు శో
కాంధుని(జేయుపీడిన నిఁకఁగతి యెవ్వరు? నాకు సద్గురూ! 26

తల్లి గతించిపోయినది-దండ్రి దరిద్రతఁ గ్రుంగె-నింక నా
తల్లియుఁదండ్రివీవె గద! తథ్యముగా నునుపాల వెన్నెలల్
చల్లు నెడందతో మనిచి, చక్కనిశిక్ష యొసంగి, కమ్రసం
ఫుల్లమ్ము-జీవితం బొసఁగి-ప్రోచుట నీపనికాదొ? సద్గురూ! 27

రాముఁడు నాకు నీవెయయి రక్షయొనర్పుము, లేనిపోని పో
రాములు గట్టిపెట్టుము, పరాత్పరుఁ డన్నను వేరులేదు, తం
డ్రి! మరినీవె జిత్తులఁ జలింపఁగఁ జేతువు, చూచినాములే-
నీమరియాద-నీయడుగు నీడలనేఁ బెన్నవెచి చుట్టెదన్. 28

ఒకపరి నీవు నావలెనె యొక్క మనుష్యుఁడ వింతవాఁడవై
సకలము నాక్రమించుకొను శక్తి నదెక్కడ వోచితంచు మా
మకహృదయంబు వల్కు—ననుమానముఁదోచును, వెంటవెంటనే
తికమకలాడుఁ బల్కులమతిన్ సుడిఁజుట్టితి నన్ని చింతలన్. 29

నీవదనంబునన్ మనసునిల్పిన యొక్కనిమేష మంతయున్
నీవయి దోఁచు—నాకనుల నిండును బచ్చి వెదుళ్లకాంతి యే
వోవినిపించు, నాయెడఁదవోసల నైవె దికబుక్కుమూహ తం
త్రీవిశదామృతస్వనము నిండుతనంబులు క్రేళ్లు దాఁటఁగన్. 30

కాంతులు జారిపోవు కడకన్నులతో ననుఁజూచి యాన వె
ట్టింతువు పాడుమంచు నపుడియెద ఝల్లన వ్రీలునో స్మయో
ద్భ్రాంతమటంచుఁదోఁచెడును, స్వామి! నినున్ గనుఁగొందు- వేదనా
దంతురితంబు నాపెదవి దాఁటులు వెట్టును దుఃఖబాష్పముల్. 31

ఆసలుదూయు నీమృదు దయాపవనంబులు వీఁచునంత, స్వా
మీ! సివమెత్తుసమ్మదము—మేను హఠాత్తుగ విస్మరించి, నీ
నాసముఖంబునన్ గలుగునంతరమున్నదల పోయకేమి యో
యీ!-సఖ! యంచుఁబిల్తు మనియెంతును నాహృదయాధినాథునిన్.

మోయఁగరాని చెడ్డతలఁపుల్ పెనునాగులు వోలె నాల్కలన్
నాయెదఁగ్రోయు—నిల్పుకొన నావశమా? గురుదేవ! చిత్త భూ
షాయిత మూర్తివై వెలుఁగుఁ జల్లుచు నిల్చినఁగాక పావకీ
లాయితజీవికర్కశవిలాపము లెవ్వరు విందురు? సద్గురూ! 33

మాటికి మోసులెత్తు కసుమాలపుభావము లప్పుడప్పుడే
సూటిగ గిల్లివైచి, దెగఁజూతును, కాని యనేకజన్మ స
న్నాటితమైన యీపశుతనన్నుఁ దెమల్చుకొనంగ నీదయ
త్పాటితబుద్ధినై సుఖము పజ్జలఁబారుదు వెఱ్ఱివాఁడనై. 34

ఆఁచెడుభావముల్గలఁచునప్పుడు, ధార్ష్ట్యముతోడ నేఁదెగం
జూచెడునప్డు, నీవు ననుఁజూడవలెన్ ప్రభు! యూర్పుమంటలన్
గ్రాఁచినదేహమున్ వెలుఁగురాలిన కంఠము నాచుఁ దీవ్ర చిం
తాచితుఁడౌచుఁ జుట్టుకొని తల్లడమందుదుఁ ద్రాచుపోలికన్. 35

పరులుత్సాహము మోదములందు వికసింపన్నవ్వఁగాఁ జూచి, యీ
శ్వరు నేపూవులఁ బూజఁజేసిరొగదా వారంచు! వాపోదుఁ దం
డ్రి! రవంతేనియునవ్వు నాకెపుడు రానేరాదు–నాకర్మ మేం
మిర? యేదోయొక చింతపట్టికొని నన్ వ్రింగున్ దివారాత్రముల్.

ఒక్కొకసారి నవ్వెడు సుయోగమొ జన్మకులేదటన్న, నె
న్నక్కురితిన్ ముధాహసితకల్పమొనర్తునుగాని, బాధచేఁ
బొక్కుదు–రంగు కాగితపుఁబూవులఁబోలిన యెండు నవ్వులో
నెక్కడిశాంతి! మైనిదహియించును రేఁగెడు క్రొత్తదుఃఖముల్. 37

గుండెలుదన్ని ప్రాణములు గ్రుమ్మెడు దుఃఖము వోవునట్లుగా
దండిగ నేడ్తమన్నను వృథాదురహంకృతి యేడ్వనీదు–నె
న్కొండలవంటి దుఃఖముల కున్మదియాగదు నిల్చి, తండ్రి! యీ
యెండినకట్టె బాష్పజలమే గఱవైనది నా యభాగ్యతన్. 38

ఏడువకున్న గుండెలవియించును బెన్వగపున్నబాష్పముల్
గూడ శుగగ్నికుణ్డమునకున్ నుసియైనవి లేవు–ప్రేమ
పాడఁగ దండిగానొసఁగి బాష్పములైనను–నాసదీర న
న్నేడువనైన నీవు! యిది యేమి యనర్థమురా! జగత్ప్రభూ! 39

నవ్వులు భాగ్యవంతులకునై ముడివేసి బిగించినారు పో,.
నవ్వెడు భాగధేయముల నాదృతజన్మకు లేవు, పోవనీ
నవ్వక యేడ్చిపోదమునిన్ మఱితోఁచదు–దైవదృష్టిలో
నవ్వుకుఁబోలె నేడ్పునకు నాణ్యము వచ్చినదేమిరా? గురూ! 40

పరసతులన్గనుఁ గొనినఁ బాడుమనంబొక పిచ్చికుక్కయై
పఱఁగిడు నైతికంబులగు బంధములన్ దెగదూసి వెంటనే
వెఱియు నిరమ్మదమ్మువలె విమోహితబోధలు—వీనిమధ్య, నా
యురమొకశుష్కకాష్ఠమగునో? తెగఁగాలునో? యంచు నేడ్చెదన్ 41

అప్పుడప్పు డాత్మవంతుల—మహాత్ముల జీవితముల్వారించి, నే
నెపుడెపుడంతయౌదునని యుబ్బడియౌ కుతుకంబుతోఁ బ్రయ
త్నపడెదఁగాని, నా తెగువ దగ్ధమగున్—బయి నెత్తివచ్చు ని
ష్కృపములు విఘ్నముల్ ననుఁదరింపఁగనీయవు, తండ్రి! నాగురూ

కలుషితవృత్తి నొక్కఁడపకారమొనర్చిన దాని నోర్చికోఁ
గలుగుటయేగదా, నిజముగా నమరత్వమటన్న! బుద్ధి ని
చ్చలు మదినిల్వ దాక్షణమశాంతిని వీడి దురాగ్రహవ్యథా
కులితుఁడనై నటింతు, నొకక్రోతిగ—నొక్కపిశాచరీతిగన్. 43

పరులను నిందసేయుటది పాపము—గాని రవంత నామనోం
తరమున నొవ్వగల్గినఁ గృతాకృతచింతలు మాని, రేఁగి, ని
ష్ఠురముగఁ దిట్టుదున్-బిదపసూడును నన్ననుతాపమప్పుడున్
బురపురఁ బొక్కుదున్—దెలివి మూఢతనొందెనటంచు, నాగురూ!

పూఁపవయస్సులో నుడుకుఁబోతుతనంబది, మంచి చెడ్డలన్
దోఁపఁగనీదు, తండ్రి! నగుదున్ బెరవారలఁజూచి నేనె వి
ద్యాపరిణాహశాలినని-తథ్యముఁజూచిన నేనెపో యువి
ద్యాపరిరంభజాల్ముడను-దర్పభరప్రవిలుప్తచిత్తుఁడన్. 45

గగనమునందసంఖ్యమయి కాంతి వెలార్చెడు తారకాసుమా
ళి! గనినయప్డు చేతము జ్వలించును—నే కవినన్న భావమున్
నెగలయి పోవునూరుపుల—జీవితమొక్క నిశీథమౌచు నె
వ్వగలఁ దపింతునేకతము-పాపము పండిన గ్రుడ్లగూబనై. 46

శాంతి యలభ్యయోగమని సత్పురుషుల్ వచియింప విందు, నా
స్వాంతము పేటకుక్కవలె జబ్బున దాఁటులుగొట్టుఁ, దండ్రి! నే
నెంతగబట్టికొన్న గ్రహియింపదు నాగతియేమి! ముక్తిసి
ద్ధాంతవినోద! దీనజనతావన కారణజన్మ! నాగురూ! 47

ఆలయభూమి దోఁచెడు ప్రయత్నముఁబూనిన చోరులన్ ధను
ష్కాలులు రామలక్ష్మణులు చక్కియనిల్చినవారు—తద్విభా
గోళముఁ జూడలేక పడఁగూలిన, వేకువ రాముఁ గన్నులన్
గ్రోలిన భక్తులంచుఁబలుకున్ దులసీప్రభుఁ డెంతధన్యుఁడో? 48

ఒక యవివేకి యాగ్రహమునూని పదాహతిడుల్ల నేసినన్
బ్రకటము సేయఁడా-మధురబాబుకుఁ-దన్గనికొల్చు ధర్మక
ర్తకు—యతి—రామకృష్ణుఁడు పరప్రతిహింసకుఁ దల్లడిల్లి యు
త్యకలుషవృత్తిముగ్ధహృదయంబున కెంతటి శాంతిరా! గురూ!49

ఒకపని ముందువెన్కలను యోచనలేక ముగించివైతు, మ
స్తకమున దయ్యమూనినటు, స్వామి! యనంతరమూహనేసి యూ
రక పరితాపమంది కనులన్ సలిలంబులు చిమ్మిపోతు, నీ
వికలితబుద్ధి కెన్నఁడు వివేకము గల్గితరించురా, గురూ? 50

త్యాగము-భోగవృత్తి కొకయంగముగా సవరించి, భోగముం
ద్యాగపరంబుగా వెలసిరంట మునుల్-మిముఁబోలె, వారి సూ
త్రాగమపఙ్క్తి భావముల యందు లగింపక, వెట్టివాఁడనై
యీగతి నొక్క వెట్టిబ్రతుకీడ్తు నం-దుస్తర దుఃఖభీమముం. 51

జనకునివంటి యొక్కరుఁడు సత్యమొ! యూరటలేని శుష్కక
ల్పనమొ యటంచు నెంచెదను, భావనకందదు-త్యాగభోగముల్
పెనఁగొనినట్టి జీవితము-వేసటసోలుదు, తండ్రి! గోరు
వెచ్చనివగు మార్పులే మిగిలి శాంతికి వేకరు శుష్కజీవినై. 52

భిక్షుకుఁ డెవ్వఁడైనఁ గనుపించినచోఁ బయినున్న వస్త్రముం
దక్షిణమెత్తి యిత్తునని తారసిలున్నది కాని, యంతలోఁ
బక్షములెత్తి నాకనెడు భావము కప్పెడు నీకు శంకలో
నక్షముఁడౌచు రాయివలెనై కనుఁగొందును వాని వేదనల్. 53

కడుపునఁగాలు నాఁకలికిఁ గన్నులు చుమ్మలుచుట్ట, భిక్షకై
యడిగెడు నాదుసోదరుల నందరిఁజూడఁగ లేక, నింట పె
ట్టెడు గతిలేక-నే నటమటించుచు వెట్టిగవచ్చి, వాకిళుల్
వడిఁబడమూసి, మాయవిధినైఁ గురియించెద నగ్నిఖండముల్.

తమ్ముల రక్తమాంసములు దాహభరమ్మునఁ బీల్చి, భోగరా
జ్యమ్ము గ్రసించు నీధనికజాతికి లజ్జయె లేదటంచుఁ జి
త్తమ్మునఁదోఁచి, యిట్టి గడితంపుఁ బనుల్సహియించునేమి దై
వమ్మని యావటించెదను-బావురు మంచొక యావుపోలికన్. 55

మనయాచారము నవ్వుటాలయి జగన్మాన్యంబు, వైదేశ్య వ
ర్తనమేదో యొకగౌరవంబనెడు జల్పాకుల్విజృంభించి, శో
భనహీనంబగు సంఘమున్ననినఁ దీవ్రజ్వాలికల్ ప్రేఁగు నా
మనమందుజ్జటి లూఁగుదుర్ ప్రతిఘధూమవ్యాధ్వస్తతేజుండనై.

దాసత దాస్యమంచును యథార్థముగా గ్రహియించు తాత్వికా
వేశములేక, బుద్ధిచెడి, వీఁడుప్తై, పరదేశశుష్కవి
ద్యాసముపాత్తమౌ చెనటి దర్పముతోఁ గికురించుచున్న యీ
నా సహజన్ములన్ననిన నామది బీటలువారు, సద్గురూ! 57

మాహృదయంబు లాంగ్లుల సమాదరణంబున కప్పవోయి, వి
ద్యావృతి యింటిబత్తెమున కంగముఁగాఁగ సమన్వయించి యి
ట్లే హతభాగ్యతన్గమిలి యేడ్పుటకైనను లేక యీశ్వరే
చ్ఛాహతులౌదుమో! యెడఁద చచ్చినజాతికి మోక్షమున్నదే! 58

తరిమెడు నూత్ననాగరికతా మదిరారసమత్తులైన యీ
పురుషులు, దానితత్త్వమును బూనిక నూహయొనర్పరేమి దు
ర్భరగతి? దేశమంతయును బాడయిపోయిన లేవనట్టి
నిద్దురయిది చావొ-నిద్దురయొ? తోఁచదు రెంటికిమధ్యరీతియో!

ఆయువె యాంగ్లభాషకొఱకై-తఱితీపులఁ దెన్గునోట "న
మ్మా" యని పిల్వనేరని కుమారునిఁగన్నది తెన్గుతల్లి! స్వా
మీ! యెదక్రుంగిపోవును సుమీ, కని, భక్తియు భుక్తిలేని శు
ష్కాయువు లిట్టులే వితగఁ జావఁగనేవలెనేమి! సద్గురూ. 60

జ్ఞానపరిష్కృతమ్మయిన స్వానుభవంబటే, మానవత్వమేం
గానికినమ్మి, కుచ్చితముఁగట్టిన గూండ్లు, మహాస్మశానధూ
మానిలభీకరంబులగు మాటలతో జగమేర్చు నీచుల
న్గాని పురస్కరింపరఁట! నామదికెక్కడిశాంతి, సద్గురూ? 61

మదికినిఁ దీపిగాఁబలుకు మాటకు-నామడదూరమైన, యీ
హృదయవిహీను లెట్లు గమనింతురు? ప్రేవులు విప్పిచూపిన
న్హృదియొక గారడీయనెద రేమని లాభమువారిఁ? దండ్రి! నా
బ్రదుకున కిట్టిభాగ్యమును వ్రాసిన బ్రహ్మనుఁ దిట్టఁగావలెన్.62

కాలినవత్తులట్టులు, వికారములై కళలేని శుష్క వి
ద్యాలయముల్—మనస్సను పదార్థమెలేని గురుల్—విజీర్ణ కం
కాళములైన పిల్లలనుఁ గాంచినఁ గన్నులుగుట్టు నాకుఁ, దం
డ్రి! లయకాలనృత్యము ఫలించినదేమిర దేశమందునన్? 63

గాంగతరంగగీతములు కర్ణపథంబుల జోలవాడ, స
ర్వాంగములందు భారతమహత్వము పుల్కలురేఁప, నాశ్రమా
లింగిత కమ్రపాదపతలిన్ శ్రుతులూరిన ముక్తిపుష్పసా
రంగము నాదుదేశమున రాలినదేమి శతహ్రదావళుల్? 64

ఆ మునియజ్ఞవాటికలకన్నఁ బవిత్రములైన భావరే
ఖామహనీయముల్, తటవికస్వరనూత్నసుమాళి కన్నన్
గోమలముల్, దయాభరవికుంచితముల్, ఋషిపోతపూత హృ
ద్భూమిక—లందు హత్తినవిపో! పరమాత్ముని దివ్యగీతముల్. 65

శిష్టావాంచితరజ్జుడోలికలపైఁ జెన్నారు సారంగ ఖే
లాప్రావీణ్యము—ముగ్ధముగ్ధనవతీలజ్జాదరస్పర్శలీ
లా ప్రస్విన్నవిపంచి కారసభర ప్రక్వాణముల్వోయి, జీ
ర్ణప్రజ్ఞల్, శ్రుతిచచ్చినిల్చినవి, క్షుద్రంబైన దేశంబునన్. 66

రాసిక్యంబు నశించి నిల్చినది జీర్ణచ్ఛాయ, ప్రాచీన మే
ధాసంపత్తిగతించి దక్కినది క్షుద్రప్రజ్ఞ, యద్వైత భా
వాసక్తుల్ మరణించి పేర్చినది గర్వగ్రంథి, సత్కార్య ని
ష్ఠాసౌజన్యము గూలిపోయినది, దేశం బేమిగానున్నదో? 67

అంతకునంతకేర్చి ప్రళయానిలమట్టులు దేశమెల్ల నా
క్రాంతమొనర్చె రాక్షసవిలాసము, భౌతికమే మహార్థమా-
మంతయుఁ బారమార్థికతయన్నది మందునకైన లేదు, సి
ద్ధాంతములందె నిల్చినది ధర్మము, గుత్తుకఁదన్నెఁ బ్రాణముల్.

పరనిందాకరణంబె హృద్యతరమౌ వాక్ప్రౌఢి, మద్యాదిపా
నరతుల్సభ్యత, ఘోరదుష్పథపదన్యాసంబు సంస్కారముల్,
పరనారీపరిరంభణాతురతయే రాసిక్యమీ, పాప మం
దిరకింప్రజ్ఞలు రాజకీయములు, దండ్రీ! యేమి వాపోవుదున్?

అంగదనంగవించు వికలాంగునిఁ జూచిన సాయమింత సే
యంగనలేదు పొమ్ము, పలుకైనను మెత్తనలేదు, కుక్క వో
లెం, గసరించివైతురు-దరిద్రుని జీవితమున్న దెంత దా
నెంగిలిచే విదిల్చిన గ్రహించును-నిల్చునుగాదొ నాగురూ! 70

వంవసౌకవెంటకుప్పకుసమానము, చేసెడు చేఁతలన్నిటన్
దనయంభిమానదర్పములె తాణ్డవమాడును, కుచ్ఛితంబె రూ
పెనసినబుద్ధియైన గ్రహియింపదు లోకము, వేషధారి నె
త్తిన నుపవిష్టుఁజేసికొను, దీనిరహస్యముఁ దెల్పరా! గురూ! 71

ఒకపలుగాకి పెన్నిటికి నుత్తమ శీలవతీమతల్లి, చి
క్కక మఱిచిక్కఁగా నతఁడు కన్నుల కుండలునీరుగారు నం.
తకుఁ బడమోదుఁ దత్సతినిఁ, దాఁబెరచోటుల వేసివచ్చు-నా
సకియనుఁ జూచినప్పడవశంబుగ నేడ్చెదనోయి, సద్గురూ! 72

ఈ లయతాణ్డవంబును సహింపఁగ వేయిమనంబులైననున్
జాలవు దండ్రి! ముష్కరవిశంకటతాదవభీమధూమ ప్ర
జ్వాలిత సంఘమున్గనఁగఁజాలను—జాలకతీర్పలేను-ఆ
భీలము, తండ్రి! యీవిధురవీణకుఁ జీవికఁజేర్చి యేడ్చెదన్. 73

తాడితమైన నాగమువిధంబునఁ జిత్తమురోఁజెడు నప్రషా
పీడితమౌచు, శాంతియుఁ—వివేకము నిల్వదు,—పిచ్చియెత్తి నో
నాడుదు సంఘమున్—గఠినమైన యది నన్ను బహిష్కరించి పో
రాడును—దానితో నవశుఁడై, యసహాయతఁ గ్రుంగిపోయెదన్.74

పొరపడి నవ్వినన్-హృదయపూర్వకహాసము నేతుఁగాని, ని
బ్బరముగఁ బాలలో విసముఁబ్రామిన నవ్వులునవ్వి, యున్న న
ల్వురి వలపింపనేరను బ్రభూ! యవలేపభరంబటంచు నం
దరు విపులీకరింతురు, యథార్థముఁదేల్చిన దొడ్డవారలై. 75

న్యాయమంటంచుఁ దోఁచిన మనంబున జంకొకయింత లేక, యు
న్యాయము నడ్డగించుటకునై ప్రయతింతునుగాని, తండ్రి! యు
న్యాయము న్యాయమైనె వచనమాడుట నాదురహంకృతి ప్రకో
పాయితమండ్రు! తామొక యహంకృతిదేల్చిన భాష్యకారులై. 76

పొగడుటయున్న నాకు సరిపోవదు, నన్నెవ్వరైన నవ్వులై
పొగడినఁ బొంగిపోయి యనుమోదము సేయను, నాప్రశంసలో
నగుపడు కుత్సితంబె, యయి నన్బలవంతమువిూఁద నొక్కరిఁ
బొగడఁగఁ జెడ్డకారణము పుట్టును-నాగతియేమి? సద్గురూ! 77

"అకలుషవృత్తి భిక్షమునకైననుఁ బొమ్ము-పరప్రశంస నే
యకు"మని యానవెట్టితిరి-యాగుణమొక్కటి లేనిదాననే
ప్రకుపితచిత్తులౌచుఁ బలుబాములఁ బెట్టిరి నన్నుఁ, దండ్రి! చా
వక యొకకొండచిల్వనయి పట్టితిఁ బ్రాణము మొండివాఁడనై.

పరులఁ బ్రశంసనేసి నవభాగ్యములందుటకంటె, నాత్మ సం
స్థిరుఁడయి పుష్పపాత్రమునఁ దిన్నను నామదిఁజింతలేద, యీ
శ్వరు గుణతంత్రగీతములఁ బాడుచుఁ జిక్కనిపూవువోలె, నా
పరువము వాడకుండ నిల్వనైమని, రాలినఁజాలు, సద్గురూ! 79

పడగలుదాఁచుకొన్న పెనుపాములకై మనలేను-లేనిచో,
నడుగడుగందు వచ్చిపడు నాపదలన్నిటి కోర్వలేను-చే
విడువఁగలేను భోగములు-భీకరమున్గ్రహియింపలేను-నా
నడత విచిత్రమైనది, మనమ్ము విచిత్రతరమ్ము-సద్గురూ! 80

సుకవుల్వ్రాచిన నందులో నొదిగికూర్చున్నట్టి దుఃఖంబు, జ్ఞా
నకృతిన్వ్రాచిన నందులోఁబొదుగు నజ్ఞానంబు, ప్రేమైక శం
సకులన్వ్రాచిన నందులోఁగల భవిష్యద్దుర్వియోగంబు,-మా
మకచిత్తంబునఁదోఁచు,శాంతియెటు సంప్రాప్తించునో,సద్గురూ!

ఒక్కఁడు, సాధువృత్తియయి యుండెడువానికి, లేనిపోని పె
న్నిక్కులఁదెచ్చి ప్రాణము గ్రసింతువు-వేరొకరుండు-దుర్మద
న్యక్కృతశీలుఁ డప్పికొను నైకసుఖంబులు-దీనికర్థమేం
చిక్కదు, తండ్రి! యోచనము సేయుట కెంతగఁ దల్లడిల్లినన్. 82

ఒకరుఁడు నీగుణస్తవములోపికఁజేయుచునుండ, వెంటనే
పకపకనవ్వి భక్తు నొకభ్రష్టునిగా-నొకవెఱ్ఱివానిఁగాఁ-
బ్రకటము సేయు వేరొకఁడు, వానికి శిక్షయె లేదు-పోని, వీ
నికె మరిశిక్షవైచెదవు! నీపరిపాటి విచిత్రమో, గురూ! 83

పూవులుబూవ నేలగడివోవఁగ నేలయటంచు-స్వామి! ప్రే
మావిలచిత్తుఁడై బ్రదుకునందుఁదపింతు-క్షణక్షణంబు నె
న్నోవెలయింతు వీవు; భవదుజ్జ్వలలీలలుఁ గూలిపోవు స
ద్భావికరంబులౌచు; వినియోగముఁదెల్పవదేమి? సద్గురూ! 84

ఆకసవీధిలోఁ దరఁగలై ప్రవహించు శకుంతకంఠ వీ
ణాకలగానముల్విని వణంకుదు-నేఁ-దదలభ్యశాంతి చి
త్రీకృతుఁడై విహంగత వరింతును,-పక్షులుఁగూడ క్షుద్రతా
వ్యాకులమైన యీబ్రదుకుకబ్బులు సాఁచునదేమి? సద్గురూ!85

ఫుల్లమ్ములై, కపోతములఁబోలెడు, సంపెఁగ పూలవాసన
ల్చల్లెడుగాలులన్, రసభరంబు ప్రపంచము;-కాద-కాదు-వేం
నెల్లఁగృశింపఁజేసి గ్రసియించును మృత్యువు, దీని తత్త్వమున్
జల్లటకే నశించె వివశంబయి-యెన్నియొ భావపుష్పముల్. 86

అడవులలో నొకమృగమై,
పడియలలో నీరుఁ ద్రావి, బ్రదికినచో, నా
కడుఁగడుగునందుఁ గలిగెడు
నడలుఁ గలుగవేమొకో?-దయాసుమభరణా! 87

పాపంబున కాకరమై
తాపమ్మునకుఁ దానమైన తనువేదుచుఁ, జె
ట్టో! పుట్టగానా! పుట్టిన
నాపుణ్యము పండిపోవునందును, దేవా! 88

పరుకంటఁబడక, యెందో
పరువము వెలిఁగించి, వయసు వ్రాలిన పిదపన్
ధరనొరగెడి విరిగాకను
నరజన్మము నొసఁగితేల? నాగురుదేవా! 89

ఔను ప్రభూ! మదీయసకలాశలు నీవయి, పాపవృత్తికిన్
దానకమైన 'నే'నను పదార్థము పూర్తిగమాసి, బ్రహ్మా వి
ద్యానిబిడానుభూతి హృదయమ్మునఁ ద్రావఁగ నూహసేతు, నా
లోనె కుదింతుఁగోరికల, లోకము మెచ్చదటన్న చింతలన్. 90

చింతలుచిత్తమందెసఁగి, చిందరవందరసేయు నప్పుడా
వంతయు దుఃఖముంబొరయునట్లుగ, నిత్యము నాత్మతృప్తిరే
కంతయుఁ దగ్గనట్లుగ, దయామతి దీవెనలిమ్ము! ముక్తి శం
ద్ధాంతవినోద! దీనజనతావనకారణజన్మ! నాగురూ! 91

పాపము, సౌఖ్యపుమ్ముసుఁగుఁబై ధరియించి, ఘటించినప్పుడా
చాపలముత్తరించికొను జ్ఞానము నాకడలేదు-నీవె నా
కాపుగనిల్చి యట్టి యవకాశమె యివ్వకు, తండ్రివైన నీ
ప్రాపున నాడనిమ్ము-పసిబాలకు పోలిక నన్ను, సద్గురూ! 92

తలఁపులె కార్యరూపమును దాల్చును—బండిన యప్పుడట్టిచోఁ,
దలఁపులు చెట్టలైనను గృతంబులు దూష్యములౌను, మన్మనో
నిలయమునందు నీవెపుడణీయము దివ్వెగవెల్గి, కల్గు నా
తలఁపుల సంస్కరించుము, నితాంతదయావరిణాహ! సద్గురూ!93

ఆశకుఁబాదు నీయభయహస్తము నాతలపైని నిత్య సౌ
ధాశనచంద్రికాలలిత తాణ్డవముల్ జెలఁగింప, భావనా
కాశమునందు నీవొకఁ డఖండరసాకృతి వెల్గు వెల్గుచున్,
నీ శివతాతికాంతులను నింతువుగాక! యెడందలోపలన్. 94

చీకటికోనవంటిదగు జీవితమందున శాంతిలేశమున్
లేక, కృశించిపోయెడు మలీమససంధ్యలయందు, స్వామి! సు
శ్లోకము-నీస్వరూప-మెదలో వికసించి, పవిత్రశాంతి స్వే
చ్ఛాకిరణంబులన్ వెలుఁగుఁజల్లుచుఁ దృప్తునిఁగా నొనర్చుతన్.95

స్వామి! యసంఖ్యలౌకికవిపత్తులఁబోరి, యలంతఁగూరి, వి
శ్రామముఁగోరు నాయవసరంబుల నీవొక మాతృమూర్తివై
ప్రేమతుషారబిన్దునిబిరీసము—కల్పక పల్లవావళీ
కోమలమైన చూపు నొడఁగూర్తువుగాత! మెడందలోపలన్. 96

పలికిన, నూరకుండినను, బాడిన, నేకడఁజుట్టుచుండినన్,
నిలిచినఁగాని; నీచరణనీరజముల్-కరుణాప్రసన్నముల్-
కలకలనవ్వినట్టులు, వికస్వరరూపములైన యట్లు; నా
తలఁపున నిల్చుఁగాత! జనతాపనివారణకేళి సద్గురూ! 97

కలలెల్ల నీవయై వ
న్నెలు చిలికెదుగాత! సుగుణనీరధి! నీ క
న్నులలోని కాంతులే, నా
కలలకు జీవంబులౌనుగాత! గురూజీ! 98

అనునయశీతలమ్మును, దయాభరమంజరితమ్ము, హాస చి
క్కణమగు నీకటాక్షము వికస్వరకల్పకపాదపంబు—నా
మనమున నిల్చుఁగాత! మనుమానముచేఁ గొడిగట్టినట్టి శాం
తనిభృతసుందరంబయి తనర్చెడు, చిక్కనిప్రేమ దీప్తమై. 99

నీవే పలికించితివో!
దేవా! ముత్తెములవోలు దీవెనలిడి, తీ
వ్రావేశభాసురంబు—మ
దావహమగునట్టి నీ ప్రథమశతకంబున్. 100

  

పదహాతిఁదిన్నగా వెనుక
                పాటున వచ్చెదవేమి? యూరకే
బెదరఁగఁజేతువేమి?
                వలపింపుల తియ్యనిచూపుఁ జూడకే
యదలిచిపోదువేమి?
                నిలువంతయుఁ జెమ్మటపోసె, నీదు స
మ్మదమిఁక బెండుగాను?
                నొకమాటయునాడవిదేమిరా? ప్రభూ!

# విభూతి శతకము.

శ్రీరమ్యంబగు రూపుతోఁ బతితమర్త్యాత్ముల్ గటాక్షించి, సం
సారక్లేశపరాఙ్ముఖత్వసుఖసాక్షాత్కారతాసిద్ధి—స
ద్వైరాగ్యంబు ఘటించి, మోక్షపదవీభద్రాత్ములం జేయు సా
కారబ్రహ్మము—సద్గురున్-సకలలోకస్వామి, నర్చించెదన్. 1

లోపల వెల్గు వెల్గులకు రూపము వచ్చుటటుండ, బ్రహ్మవి
ద్యాపరిపూర్ణతాఘటితమైన రుచిస్ఫురణంబుతో-జగ
ద్వ్యాపకుఁడైనవాఁడు-భగవంతుఁడ నిక్కమ్మయినవాఁడు—భ
క్తాపదఁ బాపువాఁడు-గురుఁ డస్మదుపాంతములన్ వెలుంగుతన్.

ఎవ్వనియేని దర్శనములిచ్చు సమస్తము, భక్తకోటియుం
బెవ్వనియేని నవ్వుగురియించును-శాంతియుఁ గొంతకాలముం,
బెవ్వని యూర్పులందు జనియించెనొ ప్రాఁబలుకట్టి, ముక్తికిం
దివ్వె-పరాత్పరుండు—గురుదేవుఁడు, మాకు ననుగ్రహించుతన్. 3

తానుఁ బరాత్పరుండనెడు తథ్యముఁ గప్పుట కెట్టి వింతయో
గాని జరించు, మానవునికైవడి నొక్కొకసారినుండు, న
జ్ఞానివలెన్, శిశుక్రియ—ననంతవిలాసవిశేషపుష్టితో
ధ్యానము-సద్గురుండు-సతతమ్మును మమ్ము ననుగ్రహించుతన్.

నవ్వులపువ్వులన్ గపటనాటకముల్ పచరించువాఁడు, పై
నెవ్విధినైన లోఁబడక నింద్రియముల్ వలగొన్నవాఁడు, దా
నివ్వెఱపాటుఁ గూర్చు రమణీయవపుఃపరిణాహి, పాపికిన్
దివ్వగువాఁడు-సద్గురుఁడు-దారమతిన్ మము వెంటనంటుతన్. 5

అక్షినిడాఁచికొన్న నిటలాక్షునిఁబోలి, విభూతులెల్లఁ బ్ర
త్యక్షము సేయువాఁడు,—కమలాక్షునిపోలిక లోకరక్షణా
దీక్షితుఁడైనవాఁడు-గురుదేవుఁడు, బ్రహ్మనుబోలి వేద సం
శిక్షకుఁడైనవాఁడు, దయ సేసి నిరంతర మోముచుండుతన్. 6

చిరముగ మాకునై తపము సేసెడువాఁడు, పవిత్రపన్నగా
భరణములేనివాఁడురు కృపా పరిపూర్ణవిలోచనాబ్జని
ర్ఝరముగఁ జూపుతోఁ బతితులన్ గరుణించెడువాఁడు, శిష్య హృ
త్సరముల నేలుజేఁడు దరితోఁ గనిపెట్టునుగాత మమ్ములన్. 7

రాముఁడుతానయై విధికి రామునిఁగొల్చెడివాఁడు, భక్తహృ
ద్భావములఁబొంచి చెట్టతలఁపుల్ గురిసేసెడువాఁడ, గమ్యమా
యామంషితుండువోలె నరుఁడై వ్యవహారము సేయువాఁడు, మా
యావృదితుండుఁగాని గురుడాప్తుల-మమ్ము సముద్ధరించుతన్.

కారణజన్ముఁడై నిజముఁగప్పి పరీక్షయొనర్చువాఁడు, మం
దారమనోజ్ఞమూర్తి, జనతాఘనతాప కరాళవృత్తికిన్
దీరుగడైనవాఁడుఁ, దరితీపుల నెయ్యము సేయువాఁడు, కాం
క్షారహితుండు, శిష్యహితకర్మరుఁడౌ గురుఁడెప్పుడోముతన్. 9

నా కవితాకుమారివలె నవ్యవిలాసములేనివాఁడు, ప్రే
మైకనిధానమైన హృదయంబునఁ దల్లినిబోలువాఁడు, ముం
గ్ధాకృతి నొక్క చిన్నిశిశువన్ననుఁ జాలనివాఁడు, భావముల్
వ్రాఁకిన పెద్దవాఁడు గురువర్యుఁడు—మమ్ము శమించుఁగావుతన్.

మానవుడందమన్న నతిమర్త్యము నీచరితంబు, దేవుఁడే
గానియటన్న నాకథలు కల్పితమంచని త్రోసివైతు వీ
వే, నినునేగతిన్ మదిగ్రహింతుము? దైవమొ? కాదొ? చెప్ప వ
య్యా! నయనమ్ములున్న జనుషాంధులఁజేతువు మమ్ము, సద్గురూ!

ఇక్కడఁ గూరుచున్నపుడె యెక్కడనో యొకభక్తునింటిలోఁ
జిక్కకచిక్కి సాపడివసింతువు, వేఱొకచోట-బాధచే
స్రుక్కెడు శిష్యునిన్ మృదులసూక్తుల నూరటఁ దీర్తు-వింతకున్
నిక్కముఁదెల్పవోయి! గురు! నీవనువెందరో? లెక్కపెట్టనన్. 12

తలగడచేయిగా నిదురఁదాల్తువు వచ్చినవాఁడవోలె, నా
"మెలఁకువనిద్రలో", సకలమేదినిఁ జుట్టెదు, నమ్మికొన్న భ
క్తులకునుఁ బుణ్యరూపముయిదోఁచెదు, నీయది నిద్రయున్న మా
మెలఁకువ వ్యర్థమై వెఱనిమీలిత నేత్రులమౌదు, మోగురూ!13

మఱియొకసారి నీలమ్ములు మాటిన చిక్కనిచూపులెత్తి, యం
ప్వరమునఁజూచి, ఫక్కుమని పైఁబడినవ్వెదు, నవ్వుటంచులన్
విఱిసికొనంగ, నిర్మలకవేరసుతాచలదూర్మికంకణ
స్ఫురితనిసర్గశైత్యములు-పుణ్యఫలంబులు—భావమంజరుల్. 14

ఇంకొకసారి మమ్ముఁగని హెచ్చరికించెదు, మోక్షకామినీ
కుంకుమపత్రభంగములకున్ జిగి ముత్యపుటంచుదిద్దు, ని
శ్శంకమనోజ్ఞహాసముల, స్వామి! యపత్రపలోఁగిపోయి సా
శంకములైన చిత్తమృగశాఖము లొక్కటఁగ్రేళ్లు దాఁటఁగన్. 15

పాటలవల్లికీమృదులపల్లవభా పరిభావియౌ జటా
జూటమునల్లిపోఁ, బికిరిచూపులతో నటుచూచి, మస్తము
న్నాటితముఁ బొనర్చెదవు, నాగురుదేవ! తదీయు మర్థముం గన్
బాటనసేయ నేరక మనంబులు—బుద్ధులు-సందడింపఁగన్. 16

కలగనునట్లు తండ్రి! చిబుకంబున హస్తము నూఁది, తీవ్ర ని
శ్చలతరదృష్టులన్ తతదిశావలయంబునఁ గ్రుమ్మరించి, ని
ష్ఫలసెగవోలెఁ గాంతిఁగడివోవగ నూర్చెదు-పూవులట్టి నీ
తలఁపుల నగ్నిఖండములు దార్చిన నెవ్వగలేవిరా! గురూ! 17

విరిసినతమ్మిలట్లు ‘గనువిందొనరించెడు కన్నుదోయి, కో
టరమునయందుఁ బుల్గుల విడమ్మనఁజూపులు, సుళ్లుజుట్ట నెం
దరయక—నిన్ను నీవె మహితాదృతిఁజూతు, దుష్పార్శ్వశైలకం
దరముననఁదొల్లి శంకరువిధంబునఁ జూచుట కర్థమేమిరా? 18

కలకలనవ్వు—నవ్వుల నిగారపుఁగాంతులలో ననేకమై
పలుకులు, చిన్నచిన్నగ విభక్తములై దెగిపోననేమొ-ప్రాఁ
బలుకులు మాటలాడెదవు, స్వామి! గభీరతసైఁపలేని పి
ల్లలతలిరుల్ దలంపుల విరాటములౌచు పరిభ్రమింపఁగన్. 19

చాతురిజారిపోవ నెకసక్కెములాడెదవేమి! తండ్రి! మా
యాతన నీతలంపునకు నంటినదో, మరిలేదొ? మేనిపైఁ
గోఁతకు కారమున్ మెదపి కొట్టెదవేమి, దయావిహీనతా
శాతములైన వర్తనలుఁ జ్ఞానులకంటిన విద్యలేమిరా?' 20

తెగువగ నెప్డొ కోటరముఁదీర్చిన యువ్వయువోలె, నోర్మిపై
మంగుదలకెల్ల నింటితనముల్ వచియించెద వానవెట్టుచుఁ,
మంగలకు నీతి నెప్పెదవు- మౌని! తపస్వులయందువోలె, నీ
వగణితవక్రవృత్తులు గృహస్థులయందును దొడ్డవాఁడవో! 21

అవునొకసారి పెద్దవ్యవహారవిదుండవువోలె మోయు నీ
యవు, మంటియన్యులఁ జదురులాడెద, పాడినవానికెల్ల నే
ర్పవియుఁగఁ గొట్టి నెప్పెదు గదయ్య! భవన్నటనాధురీణతా
నవనవలీల లెన్నియయినఁగల వెవ్వరు దేర్లుత్తు? నాగురూ! 22

పలికనమాటయే మఱలఁబల్కెదు, చూపిన యట్టి భావమే
యులయుక సోగబొమ్మముడియందు లగింతువు, చేసినట్టి చే
ష్టలెవరిఁజేసె దెందులకు? స్వామి! పదింబదివల్లె వేతువో
కళయొక నిత్యసుందరసుఖంబను నీతి సముద్ధరింతువో! 23

పులకలిగిర్చు హస్తములముద్రలు పట్టి, హసించు మల్లెపూ
వులకెన్నయైన చూపులనుబూనిచి,-చూపులరేకులందు నీ
తలఁపులుదీర్చి,లేఁదలఁపుదారులభావముఁ గ్రుమ్ముచుఁ రసం
బులఁబ్రకటింతువేమి? పలుపోకలఁజిక్కని దేవకన్యవై. 24

నాగురుదేవ! నీభరతనాట్యమహాంబులలోని సర్గరుఖం
పాగతివోలి భావములుపారుట గన్గొని, నాతలంపులున్
రేఁగెడు, నెచ్చటోపలవరింతు వియచ్చరకన్యకాసుధా
భోగమనోజ్ఞగీతములు పూచిన—పండిన వింతదీవులన్. 25

శారదరాత్రివేళల మసారవిలోచనపింఛికా పరి
ష్కారముతోర్నవైవెం, భువనసంతతిదక్కఁ గొనంగ—రాస లీ
లారతిఁ జొక్కినట్టి చవులందలపించెద వేమొ! దివ్యబృం
దారమణీయభావములఁగదా! తొలినాట్యములో జగత్ప్రభూ! 26

అలరులఁబోలు వ్రేళులు లయానుగుణంబుగఁ ద్రిప్పిత్రిప్పి, భా
వలతలఁబెంపుఁ దీర్చెదవు, స్వామి! యిదెక్కడి కర్మమయ్యె! నీ
జిలుగు పిసాళికన్నుల రుచిన్ గనుబొమ్మచలించినంతనే
నిలువున నీరుగాఁగరఁగి నిల్తును నేనొక ముగ్ధరాధనై. 27

ఘల్లుర మంచుమ్రోయు చిరుగజ్జెలనాదములేక, యే లయా
భ్యుల్లసితంబు సూపునలవున్ గటకాముఖహస్తముద్రతో
నుల్లము దూరనేయు పిడియొప్పునుఁ జూచినదాది ప్రేముడుల్
చల్లెడు నీస్వరూపమె నిజంబుగ వ్రేలెడుఁ గన్నులందునన్. 28

నావెనువెంటనే మధురనాట్యములాడెదు, చూచినంతనే
లేవిదియేమి చోద్యము? భళీ! శ్రుతిసౌధవిహారియౌ జగ
త్పావనమూర్తి యిట్లు పసివారల పోలిక నవ్వి యాడునే?
తావులు గ్రమ్ము నీసుచరితమ్ములు—కన్నులు నమ్మలేవురా! 29

అరవిరిచెక్కులన్ మధురహాసము బంగరుపూఁతఁబూయు, సుం
దరమధురమ్ముగాఁగఁ గరతాళముఁదట్టెదు, వెన్కఁజూతు నా
యెరుఁగనివాఁడవోలె గమనింపవు-చూడకయున్న ముగ్ధమం
థరహాసితంబుతో సుమకటాక్షము గ్రుమ్మెద వెట్టివింతరా? 30

ఆల తలంపులందు మధురాశలు పూవఁగఁగాచికొన్న, గో
పాలకమూర్తి! ధేనువుల భంగిమముం గరుణింతువో! జగ
త్పాలకముల్-గటాక్షములు-వాల్తువా! యాశలు పండఁజేతువో!
మేలములాడి మేనివిరి, మెత్తువో? అంతటిభాగ్యమా! ప్రభూ!

నేనొకధేనువై, సొగసు నింపిన, నారమణీయశృంగ కో
టీనవకుట్మలంబుల గడింతువు పట్టుల కుచ్చులన్, గళల్
పూనినకన్నులందుఁ దడిముద్దులఁబెట్టెద వేమొ? శుష్కవాం
ఛానిబిరీసమీ-మనుజజన్మము-నాపయి నెత్తితేమిరా! 32

అరవిరిదండ శృంగములయందు, లలాటమునందుఁ గుంకుమం
బరుతను గర్ణికారసుమహారము, విచ్చిన యంఘ్రులన్ మనో
హరమగు పచ్చిలేఁబసపుటందముతోడ, వసంతకోమలా
భరణ యుమాకుమారివలె, భావము పండఁగఁజేయునా! ప్రభూ!

కరువునుబోసినట్టు లొడికమ్ముల ప్రేఁతల జీవనమ్ము, పు
ల్లరుచిరమూర్తి! నీవు-వ్రజరాజు చరించెడువేళ, నీదు మే
నొరసి యనన్యసౌఖ్యచలితోర్ములఁ వ్రాఁ గన్మువెచియున్న నా
పరువముఁజూచి నీవె పెరవానివలెన్ వెఱగందవా? ప్రభూ! 34

యామునభూములం, జలుదులంశ యొనర్చెడువేళఁ, జంచలా
క్షీమహనీయమండలవశీకృతుఁ, గన్గొని, సోపహాస ల
జ్జామధురార్ద్ర దృష్టులను జల్లుచుఁ బూజయొనర్తునేమొ? కా
నీ, మనుజత్వమిచ్చితివి నీమది యెంతటి కర్కశంబురా! 35

నాఁటిబెడంగులన్ విడచినావనుమాటయెకాని, నీకు నే
లోటుర! మంచిముత్తెపుసరుల్ దలపైని శిఖండదామముల్
బాటనసేయుమి న్నొసలిపైఁబడు వెండ్రుకలన్ని యున్నియున్
నీటుగ హత్తికొన్నయవి నీకిపుడున్, దొలినాఁటి పోలికన్. 36

అలనుఁగాచినావు, మునుపంగదతోదురపిల్లుచున్న భ
క్తాళినిఁగాచినావిపుడు కమ్మనివేణువుఁబూని రాగల
క్ష్మీరమణీయమూర్తిఁ గులికించితి, నాఁడును నేఁడుగూడ లీ
లారసమించ్చి మాహృదయరాగము గొంటివి, భేదమేమిరా! 37

నీవు కిశోరకృష్ణుఁడవె నిశ్చయమోయి! గభీరవృత్తికిన్
దావలమౌ భవత్సుచరితమ్ములుఁ, నాఁడును నేఁడు—భక్తచే
తోవహముల్, ధరావలయధూర్వహముల్, గనులున్నవారు నీ
పావనమూర్తి గ్రోలెదరు భక్తిపుటంబుల—లేక లేదుపో! 38

నేనెటనున్న నావెనుకనే చరియింతువు నీడవోలె, స్వా
మీ! నినునేగతిన్బిలుతు? మిత్రుఁడవందునా దండ్రియందునో?
యానతియిమ్ము, మజ్జననియందునొ! నా కడమాటఁ జెప్పనా?
దీనుని నన్నుఁ-గాచికొను దేవుఁడవందును సుమ్ము! నాప్రభూ! 39

పదహతిఁదిన్నగా వెనుకపాటున వచ్చెదవేమి? యూరకే
బెదరఁగఁజేతువేమి? వలపింపుల తియ్యనిచూపుఁ జూడకే
యుదలిచిపోదువేమి? నిలువంతయుఁ జెమ్మటపోసె, నీదు స
మ్మదమిఁక బెండుగాను? నొకమాటయునాడవిదేమిరా? ప్రభూ! 40

ఆకుచలించినంత పవనాహతి నీసడియంచుఁజూతు, మా
ధ్వీకమదారుణంబయిన తిన్ననికంఠము నెత్తి కోయిలల్
గేకలువెట్టినంతఁ బరికింతును వేణునినాదమంచు, నా
యాకులపాటు నీకు నగ్వైనది—యెంతనియేడ్చి కొందురా! 41

కలువలతోడనే బొమిడికంబు రచించితి, పెద్దనెమ్మి యీఁ
కలుసవరించి; మల్లెలనుఁ గట్టితి లేమొలనూలు, కొండ గో
గుల్లఁ గడియాలుఁదీర్చితిని, కూరిమిఁగైకొనలేవు వింత బా
గులపసివాఁడ! యెవ్వరికిఁగూర్తును! కన్నులఁజూతురా? ప్రభూ!

కనుఁగొనయంచులందు కళఁగారఁగఁజూచుట యొక్క వింత, పై
కొని నెఱమావిపూఁత గిలకొట్టుచు నవ్వుట యొక్క వింత, వి
న్ననియెలుఁగిచ్చి ముగ్ధవచనంబులు పల్కుట యొక్క వింత, యొ
ప్పిననెఱకాఁడ! నీచెనఁటివింతల నెన్నిటిఁజెప్పి కొందురా! 43

రా మధుముగ్ధమూర్తి! యిటురార, సుగంధిలకీర్తి! చక్కన
య్యా! మదమత్తగోపవనితాంతరమానము దోఁచికొన్న దొం
గా! మిడివేలపుం వయసుకల్లరిచేఁతల మోసపుచ్చి, యే
లా మదిఁదూలఁబుచ్చెదవురా? అతిలోకవిలాససుందరా! 44

రాలుఁజిగిర్చు చూపుల కురఙ్గముపోలికఁ జూతువేమి? ముం
గ్ధాలసమూర్తి! పాటలజటాభరణంబు శిరీషమాల, పై
పైలయుసూపఁ గన్బొమలవంచుచు నాట్యముఁ దీర్తువేమి? శో
భాలులితాఙ్గ! నీమనసు పజ్జల నేతలఁపుల్ ఫలించురా? 45

పరుగిడిపోదు వెవ్వరినొ పట్టెడువాఁడవు పోలెవెంట—నే
మరి—యొకరాయివై నిలుతు మౌనముగా నలపచ్చికన్నులే
దెరువవ, దెంతపిల్చిననుదీయనిపల్కులఁ బల్కవేమి! యే
ర్పరుపఁగరాని నూతనవిలాసము లెంతటి చేఁతలో! ప్రభూ! 46

మంకెన పూలరేకులను మచ్చరికించెడు నీదు మోవిపై
నింకిటపొంగఁజేయకుమ! యీతెలిముత్తెపునవ్వుపాటకై
రంకు సమూహామాత్మపలలంబుల నంకువ పెట్టినట్లుగా
సంకటపాటుఁ జెందితిమి—చాలును నీచెలికారపుఁగతల్. 47

అడ్డపుఁదారులందు చరణాబ్జములుంచి, భయమ్ములేని యా
పడ్డయువోలె దూఁకెదవు, స్వామి! కఠోరమ్ములైనముండ్లు నీ
కడ్డమురావా! కోమలపదాగ్రము లింతకు వాడు చెందునో!
గడ్డముబట్టి వేడెదనుగా! రహదారినిఁ బోవరా ప్రభూ! 48

చుఱుకునఁ గంటకంబొకటి చొచ్చిన నీపదమందు, వెంటనే
చుఱుకున నామదిన్ నిశితశూలము సూడును—నీదు మోవిపై
నఱవిఱినవ్వు భక్తులకు నామెతఁబెట్టిన యంత నామనో
తరమున వేయివెన్నెలలు నాట్యములాడునురా—జగత్పతీ! 49

అగణితకాంతి చంద్రికితమైన మనోహర వక్త్రమెత్తి తీ
యఁగ నొకమాటపల్కితివ? యాసలుదూయునునాకు, భాగ్యముల్
జగమునవెల్గి త్రుళ్లిపడు చందముదోఁచును, గన్నులందు ధా
రగ స్రవియించు బాష్పములు-లజ్జకు లజ్జయెలేదురా ప్రభూ!

మాటకు—నే శిరీషకుసుమాంగిని గోపిక, నీవె యీ జగ
న్నాటకసూత్రధారి యదునాథుఁడు—వై పయినేమి చెప్పనా
బోఁటులనేనె రూపగుణభూషిత, నప్పుడు నీవె నాదు మో
మోటముఁగోరి, మేనలసిపోదువొ పోవవొ? యేమిరా, ప్రభూ!51

అచ్చపుఁబూలవంటి దరహాసముతావులు కెంపు మోవిపై
నచ్చుపడంగఁ, బుణ్యఫలమై మనయింటికి వత్తువంచు నే
ముచ్చట నెన్నిదుస్తులనొ పూనితి, మార్చితి, స్వామి యింతకుఁ
వచ్చుటటుండ వత్తువను వార్తయురాదు—జగన్మనోహరా! 52

పూవులమాల లెవ్వరికిఁబూనుతు వాడునొ యేమొ? చందనం
బే వలరాజుదేహమున కింపుగఁబూయుదు హేమపాత్రలం
దావిరియౌనొ నానిడుదకాసెగ యూర్పుల నింక కన్నులఁ
జీవము లెట్లు నిల్పుదును జిక్కకపారునొ యేమొ? నాప్రభూ!53

అవునవులే! మహాబిరుదమందిన పెద్దవు! చిత్తమేర్చు ప్రో
డవు! పిడిబాకుచూపులు గడల్కొనఁజూచుట యేమి దానిపైఁ
గవకవనవ్వు లేమి!-గడుకల్లరిమారివి బాసదప్పు గా
రవమది నీకె దక్కినదిరా! సవిలాసకటాక్షసుందరా! 54

పలికిన ముత్తెముల్ ప్రిదిలిపారునొ! లేఁతగులాబివంటి నీ
తలఁపులు జారునో! నవసుధామధురంబగు పల్కుపల్కి నా
కలకిలికించితంబునకుఁ గాంతులుదిద్దుట వేలొ! లేక పూ
వులవలె నిట్లె మౌనమునుఁబూనుట వేలొ యెరుంగఁజెప్పరా!55

వచ్చెదనంచురాని మంగవాఁడవటంచన బేల యిప్పుడే
వచ్చితి! నీవెయునర్చిన యుపాస్తి గ్రహించితినంచుఁ జూపి నా
కచ్చెరువాటు గూర్చెదవయారె! యనేక శరీరవృత్తి నీ
కచ్చినవిద్య యౌనుగద! యౌవ్రతమానస పశ్యతోహరా! 56

ఏతనువెత్తివచ్చి భుజియించితి నాగృహమందు భక్తిచేఁ
గాతర్యమైన నానిడుదకన్నుల నెవ్వరి రూపుగంటి భా
వాతురముగ్ధ మీహృదయవల్లకి నే హృదయేశుమూర్తి సం
వీతమ్ములైన గానములు వింటివి? నిక్కము దెల్పరా ప్రభూ! 57

భీతమృగీవిలోలములు విచ్చిన కల్వలపూలు సంభృతే
చ్ఛాతత భారభుగ్నములు చల్లనివెన్నెల చాలు బాష్ప ధా
రాతిగముల్ సరోజముకుళాతినిశాతమ్ములైన యట్టి నా
కాతరదృష్టిమంజరులు కంఠమునఁ బెన్నైవెవలేదురా? 58

భోజనవేళయందు మొగమోటముఁబూనితి వేమొ! నీకు నా
పూజలు నచ్చెనో! వితగఁబోయెనొ! నెమ్మదివత్తిఁజేసి నీ
రాజనమెత్తినానొ! కలలన్బడి విస్మృతిఁజెందినానొ! యు
ద్వేజితవృత్తి నెన్నిచెడుతెర్వులఁజొచ్చి పరీక్షనేతురా! 59

బాధితభక్తలోక ఘనపాపనివారణశౌణ్డమైన నీ
పాదములందు వాసనలుపండిన గొజ్జఁగినీరు వోసి స
మ్మోదమునేసినానొ-తడిపోవఁగఁ కొంగుల నొత్తినానొ తే
దో! దయనేయవేమి? కౌతుకుంచిన నాపయినొట్టురా ప్రభూ! 60

చక్కెరపాలువోలె సరసంబుగఁ జల్లగఁబల్కి మోదమున్
గ్రుక్కిళులిచ్చినానొ! వలగొన్నభయంబున దాపుదాపునన్
నక్కుచుఁ బుల్గుకూనవలెనై మరుమాటయె లేక యుంటినో
నిక్కముదెల్ప వోయి విభు! నీకు సభక్తి నమస్కరించెదన్. 61

ఏమది? కామరూపముల నెత్తెడు నేరుపులున్నవంచు నే
మో! మదిలోనఁ ద్రుళ్లిపడిపొంగెదు నేరుపు నిక్కమైన స్వా
మీ! మఱినేను గావెలయుమీ! గనులారఁగఁజూచి చూచి యీ
నీమహనీయపాదముల నించెదఁ జూపుల క్రొత్తముత్తెముల్. 62

నీవు క్షణంబులోపలనె నేనుగమారెదవోయి! యోగవి
ద్యావశ్యయై యనంతరము తత్పరిణామము నుజ్జగింతువున్
గేవలభక్తితో భ్రమరకీటము వోలిక నెన్నియేండ్లకో
నీవుగ నౌదునేమొ! పయి నేనగు జాడలుకావురా ప్రభూ! 63

నాకును నీకు నొక్కటె మనంబయినన్ మఱినీవె యౌదునో!
నాకల యీస్వతంత్రత యనంతము భక్తిసుఖంబు లీనమై
లేకయెపోవు నేమిరభళీ! యికచాలు నభేదభక్తి స్వే
చ్ఛాకలకోకిలమ్ము వలెఁ జల్లఁగఁబాడఁగఁ నీయురా ప్రభూ! 64

నేనినుఁగొల్చు భక్తుఁడయి నీవు మదక్షులనీడలందు లీ
లానటనంబుసేయు వ్రజరాజుగనున్న నిఁకేమి లోకవాం
ఛానిగడంబులన్దగిలి చావక నిర్మలమోక్షలక్ష్మికిన్
దానకమైన నీగుణకథల్ వినుతించి తరించి పోయెదన్. 65

స్వామి! చలజ్జలేజముల చాయలు పొంగిన చూపులెత్తి నా
నోములు పండఁజూతువా? మనోరథముల్పులకింప నిల్చి నా
తో మఱుమాటలాడెదవా! తుందిలమౌ కరుణాభరంబుచే
కోమలహస్తమెత్తి యొడఁగూర్తువా! నీతొలితాకుఁ జల్లగన్. 66

ఏగతివత్తువోయి! వచియింపుము ముందె చిరత్నరత్నశో
భాగణనీయమై జిలుగు బంగరుఁ జిల్కలతోడ మన్మథా
జ్ఞాగమ సూత్రపఙ్క్తులకుఁ జక్కని వ్యాకృతివోని తేరిపై
ప్రేగుగనిల్చి యొక్కపృథివీపతివై కనువిందొనర్తువో! 67

ఝల్లరు ఝల్లుమంచుఁ జిరుగజ్జెలు పాటలువాడ రాగముల్
చల్లెడు పద్మరాగమణిసంతతిలేఁజిగురీన నంచులన్
ద్రుళ్లెడు నాణిముత్తెముల తోరణముల్బైరలాడ బంగరున్
బల్లకియందు వచ్చెదవొ స్వామి! విలాసము సందడింపఁగన్. 68

మల్లెలతోఁడగట్టిన విమానములో నవకల్పవల్లరీ
పల్లవచామరంబులను వైవఁగఁజుక్కలె కన్నెలౌచు రా
జిల్లెడు నీల కృష్ణతులసీమధురాంగముతోడ వచ్చి నా
యుల్లముఁ జల్లఁజేసెదవొ! యోయి! శిఖండవిముగ్ధకుంతలా! 69

క్రొవ్విరి మల్లెమంజరితకుంతలభూమి, శ్రవోయుగంబునన్
మవ్వపు కర్ణికారములు, మధ్యమునన్ సుమకాంచి, మానమున్
ద్రవ్వెడు పారిభద్రముల దండలు నేతులఁబూని, నీటుగాఁ
బువ్వులరంగఁడై మెఱసిపోవుగదా! జగదేక మోహనా! 70

ఇట్టులె సద్గురుండవయి యీపరిణాహిజటాళితోడ, నే
కట్టునుఁ బొట్టుమార్చకయె, కమ్మనిపూవుబెడందతోడనే
నెట్టనవచ్చితీరవలె నీ మటుమాయలవిద్యఁజూపినన్
ఝుట్టుసుమీ! యిఁకెన్నటికినుండవు తీయని భావబంధముల్. 71

నీకురుచించునట్టి కమనీయపదార్థము లెట్టివెట్టివో
నాకెఱిఁగింపు ముందుగనె నాహృదయాంతరరోచి! ముగ్ధభా
వాకరమూర్తి! ప్రాణములునైనను నర్పణఁజేసితెచ్చి నీ
రాకకుఁ గాచియుండెదనురా! దళితేంద్ర దృషన్మహోచ్ఛవీ! 72

కలకలలాడు వెన్నెలలకైవడి శీతలమైవె, గులాబి తే
కుల రసమూరినట్టి చిరుగొజ్జఁగినీటనుఁ బాద్యమిత్తునో!
పిలపిలదోఁగు బాష్పముల వెచ్చనిధారలు గ్రుమ్మరించి పై
నొలసెడునూర్పు వేడి తడియొత్తుదునో సెలవీఁయరా ప్రభూ! 73

గిలుకుమెఱుంగు టందియలఁ గ్రిక్కిరియన్జిరుమ్రోఁత, మోవిపైఁ
గల దరహాసవల్లరులు గ్రమ్మ ముఖంబది యందగించునో!
పలపల కంటినీరురలిపారెడు చెక్కులతో, హతాద్వ్యథా
కులితముఖమ్మొదుర్కొనఁగఁ గోరెదవో! వివరింపరా ప్రభూ! 74

తరుణసరోజదామములు దామువివేలా! యురంబునన్ మనో
హారతులసీవినీలదళహారము వేలా! శిఖండముగ్ధశే
ఖరమునఁ దావులొత్తుకొను కల్వలదండలు గోరికొందువో!
చిరిసెనపూల పుణ్యములుఁ దీర్చెదవో! దయసేయరా ప్రభూ! 75

నున్నదనంబుగా నలుగు నూరుదునా! కనుదోయిఁ దీర్పఁగ౯
బ్రన్ననికజ్జలం బిడుదునా! కురులం దడియొత్తి దేర్పఁగ౯
సన్నజరీటువాలుఁ గొననా! యిదె కంకతికమ్ము చాలునా!
తిన్ననిదర్పణం బిచటఁ దీర్తున! యెద్దియు విస్మరింపనా! 76

అడుగులఁ నేలపై నిడెదనందువు స్వామి! కఠోరభూమిపై
నిడుటది యేమి? నీపదము లెత్తరఁ గందకయుండు టేమి? నా
యెడఁద సుఖించు టేమి? తగునేమిర! ప్రన్ననివెల్లపట్టు ష
చ్ఛదముల విచ్చియుండెదను సద్మమున౯ దయనేయరా ప్రభూ!

వచ్చెడుదారినే యెదురువత్తును, త్వత్పదపఙ్కజాతముల్
గ్రుచ్చి-కవుంగలించుకొని-క్రొవ్విరి దండల్వైతుఁ, గౌతుకా
భ్యుచ్ఛలితంబులై యెదురుపొంగులు వోయెడు చూపులెత్తి, పై
వెచ్చుగరేఁగు నీహృదయవీథి లగింతునురా! జగత్పతీ! 78

క్రొమ్ముడివీడి రొమ్ముపయిఁ గుంతలముల్చెరలాడఁ, దీవ్రవే
గమ్మునఁ బాఱగా నసదుగౌనసియాడ, మధూళమాధ్వి వా
క్యమ్ములు వల్కఁగా గళమునం దెలుఁగున్వణఁ కాడవచ్చు, నా
కమ్మనివాలకమ్ము నిడుగన్నులఁ జూతువురా! మనోవశీ! 79

ఈ నినుఁజూచునప్డు-నిలువెల్లనుగన్నులు, సేవలో సుఖం
బానెడునప్డు-నాదు నిలువంతయు చేతులు, పల్కుపల్కి నీ
యానతిఁ గోరునప్డు-నిలువంతయు నోరులు, నీస్తవంబునం
దేనురమించు నప్డు-నిలువెల్లను కంఠము లీయరా; ప్రభూ! 80

వల్లకిఁబూని పంచమముఁ బట్టుదునో! మఱిలేక రమ్యమౌ
పిల్లనఁగ్రోవి తారశ్రుతి వెట్టుదునో! జయదేవుమాధురీ
పల్లవితంబు షట్పదినిఁబాడుదునో? మఱి, సూరదాసరా
గోల్లసితం బొనర్చుదునొ! ఓ నవనీతసమానమానసా! 81

రాగములందు నాహృదయరాగముఁ జిమ్ముచు మార్గరీతితో
నే గమనించి పాడుదునొ! నీవొకశాస్త్రపయోధి-లేక దే
శీగతి జన్యరాగములు సెప్పదునో! స్వరనిర్మితిన్ హృదు
ద్వేగముఁ గోచరించెదునొ! పింఛకలాపరిశోభికుంతలా! 82

తాళము దప్పెనంచుఁ గరతాళముఁ దట్టెదవేమి యోయి! భా
వాలసమైన నామఱి పాటునుఁ జూడవొ? పూలరేకులీ
తేలఁగవెచు నేత్రములతీరు గ్రహింపవొ? నీవు ముందటన్
బోలఁగ నిల్వఁగాఁ దెలివివుట్టునె? దేహము విస్మరింపనే! 83

ఈ నిబిడానుభూతిపలుకే బెకలింపదు, తండ్రి! పాటయే
తానముగాఁగ మారినది, తానమ్మువై పయి రాగరూపమున్
బూనినదింక రాగమునుబుట్టక రోదనమేమి నిల్చునో!
మౌనమె దక్కునో! మృదులమానస మెంతటి బాధసేయురా! 84

నీవు మహేంద్రచాపరమణీయుఁడు చూపులఁ బచ్చిముత్తెముల్
గ్రోవులఁజిమ్మునప్డు గనుఁగోనలుమూతునొ యేమొ! సౌఖ్యమూ
ర్చ్ఛావిధియాస దీరఁ గనులన్ గననోచఁగనైన నీదు మా
కావలమేమిరా! కుసుమకల్పము మానస మేమిరా, ప్రభూ! 85

చూడఁగలేదవజ్ఞతను సూపెనటంచని తప్పనెంచి, పా
రాడవొ యేమొ! నాకనులయుంచుల, నాహృదయంబులో, రుచుల్
వాడని గద్దెపైఁబొలుచు రాజెవఁడో గమనించుకొమ్ము! వె
న్నాడిన నీవు నావిభుఁడె కావని దిక్కులఁజాటి చెప్పెదన్. 86

నా రతనాలపంటవయి, నా కలలోని కడానిమేడవై;
కోరికలిత్తు నీకుఁ గయికొమ్మని పల్కెదవేమొ? దేవ! నా
కోరికఁ దెల్పనా!-జలజకుట్మలరూపవిశాలదీప్తమై
కూరిమి నాయెడంద గుడిగోపురముల్ వెలిగించి వేయురా!- 87

నీ చరితామృతశ్రవణనిర్మలనిర్ఝరిణీవిలోలవీ
చీచయడోలికానటనజీవనమౌ నొకరాజహంసనై
నీచరణద్వయీకమలనీధృఢబద్ధమనోనురాగుఁడై
నీచరితంబుకే బ్రదుకనిమ్ము! మదీయతపోవనస్పతీ! 88

తూరుపుఁగొండ నెత్తములఁదోఁచెడు సూర్యునిఁబోలి, కమ్రలా
క్షారుణమైన నీవెలుఁగుఁ గన్పడుఁగాత! జగానఁ దైలపున్
ధారయువోలె నేకగతిదప్పని నీపయి నమ్మకంబు పొం
గారుననుగాత! శోణితమునందు నెడందను నాత్మయందునన్. 89

నాజననంబు ధన్యమగునట్లుగ నన్నుఁ బరీక్షసేయునే
యోజను నీవుఁ బూనుకొనియుండిన, నిల్వఁగనేర్చు సాహస
భ్రాజితమైన శాంతినిఁ బ్రసాదముసేయుము—భక్తివీరతో
ద్భ్రాజితమైన యాత్మ బలివెట్టఁగనీ! భవదీయపూజలన్. 90

గురుఁడు పరాత్పరుండనని కూళమెంగంబు—మహోస్మశానభీ
కరములినంబు; వానిఁగనఁగల్గుట—జన్మసహస్రపాప దు
ర్భరపరిణామము; మాయవసరంబులె జన్మకు లేక పుణ్యమం
దిరములు—నీకనుంగొనలనీడలు చుట్టునుంగాత! వ్రప్రైమెం. 91

గురుఁడు పరీక్షసేయుటకుఁ గోరినఁ బ్రాణములైన, మోముపై
జిరునగవప్పళింప బలిసేయునిశిష్యుడు—నాత్మఘాతి, దు
శ్చరితుఁడ—యట్టి పాంసులుని సంగతిఁబొందక పొచ్చరింప స
ద్గురువరమూర్తి, నాపయినిఁ గోటివిలోచనముల్ ధరించుతఁ 92

గురునకు బాసనేసి యొండఁగూర్పని పాంసులజాతి, పావకిం
కరుడగువాడు-వానివచనమ్ములు వీనులు సొచ్చినంతనే
చిఱచిఱలాడి నాశనముసేయును సాధకశేముషీహితం
కరమగు భక్తి, జన్మకొడిగట్టు ననంతములైన దుఃఖముల్. 93

దురితకుఠారము—సద్గురు
చరితంబునఁ దప్పలేర్చు జాల్మునితోడఁ,
బెరసి యనర్థముసేయక
గురువరుఁడే కాచి, తెలివిఁ గూర్చెడుఁగాతన్. 94

మారుఁడన్నను, గురుఁడన్నను,
మారియన్నను, భేదమెంచనట్టిడులు—మహా
పురుషులు, నాపయిఁ గురియుం
తురు మధురాశీస్సులు వర్ణతోయజ దళముల్. 95

గురుఁడే పరాత్పరుండని
యరసి, తదిష్టంబె యిష్టమయిఁ బ్రదికెడు భా
సురమూర్తి గృహాంతరమునఁ
బురువై పుట్టినను చాలుపో! గురుదేవా! 96

గురునిమహాత్తు లోకములకుఁ వెలయించెడు దీక్షతో, జగ
ద్గురులయి, యాత్రిమూర్తులనుగూడ వశీకృతులన్బొనర్చి; దు
ర్ధరమగు బ్రహ్మతేజమున ధారుణిఁ బూనినవారు—కాలమం
దరుగని వారు-సన్మునుల యాత్మలు-మమ్ము సముద్ధరించుతన్.

ఖచరులనెల్ల మృత్యువుముఖంబునఁ గాచెడికోర్కిఁ జేసి రా
త్రిచరసతీర్థ్యుఁడౌచు; గురుదేవుని యోగిరమాత్మమాంసముఁ
బచనముసేయఁగాఁ బడునవస్థకుఁ దాళిన శిష్యుఁడమ్మహా
కచుని యఖండతేజము-వికస్వరమై మమునేలుఁ గావుతన్. 98

మమ్ము సముద్ధరించు నియమమ్మునకే యిలఁబుట్టి, మాకు బో
ధమ్మొనరించి దేర్చుటకె తా మృదుసూక్తులు నేర్చి; మాకు మో
క్షమ్మొడఁగూర్పనే మహితసాధన సేసెడువాఁడు-సద్గురుం
డిమ్మగ మాతలంపులు గ్రహించి కృతార్థులఁజేయుఁగావుతన్. 99

కం॥ నీవే నేనయి, నీమృదు
భావములే నావిగాగఁ బలికించితివో,
దేవా! ద్వితీయశతకము
పావనభక్తి ప్రపూత పదనాట్యములన్. 100



# తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 7 | విదలించి నవ్వులు | విదలించిన నవ్వులు |
| 14 | 14, 15 | ప్రేమపాడగ | ప్రేమరాపాడగ |
| 17 | 8 | మూర్పతే | నూర్పతే |
| 17 | 11 | నీకు శంకలో | నీ కుశంకలో |
| 27 | 10 | శాంతియుం గొంత | శాంతి యుగాంత |
| 40 | 4 | చల్లగ౯ | చల్వల౯ |

## ప్రచురింపఁబడునవి.

★ మేఘసందేశము

★ శృంగారరామ శతకము

★ రమాస్తోత్ర తారామాల

★ విరహగోపి

★ బృహస్పతిస్మృతి



శ్రీ

# రాయలసీమ కావ్యసంపాదనా సంఘము, ఎమ్మిగనూరు.



సలహాదారులు:- శ్రీ దేవులపల్లి ఎ. సుబ్బరావుగారు.
శ్రీ విద్వాన్ బల్లారి హనుమంతరావుగారు.

అధ్యక్షులు:- శ్రీ ఆర్. శివరామరెడ్డిగారు.

కార్యదర్శి:- శ్రీ డి. విశ్వంభర బాబూరావు దేశాయిగారు.

సంయుక్తకార్యదర్శి:- శ్రీ దేవులపల్లి దుర్గాప్రసాదరావుగారు.

స్థాపకుడు:- శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రిగారు.

సహాయకులు:- శ్రీ కవితాకళాసమితి, తాడిపత్రి.
శ్రీ నైరెప వెంకటాచలమయ్యగారు.
శ్రీ ఏరూరి శీతారామశర్మగారు.
శ్రీ ఎ. ఆర్. పొన్నూరరెడ్డిగారు.
శ్రీ జి. పంపణ్ణగారు.
శ్రీ యం. రంగయ్యశ్రేష్ఠిగారు.



